# 1. మౌనంగానే ఎదగమని మొక్క నీకు చెబుతుంది

చిత్రం : నా ఆటోగ్రాఫ్ స్వీట్‌మెమోరిస్ రచన : చంద్రబోస్
సంగీతం : యం.యం. కీరవాణి గానం : చిత్ర

ప : మౌనంగానే ఎదగమని మొక్క నీకు చెబుతుంది
ఎదిగిన కొద్దీ ఒదగమని అర్థమందులో ఉంది ॥ మౌనం ॥
అపజయాల కలిగినచోటే గెలుపు పిలుపు వినిపిస్తుంది
ఆకులన్నీ రాలినచోటే కొత్త చిగురు కనిపిస్తుంది ॥ మౌనం ॥

చ : దూరమెంతో ఉందని దిగులు పడకు నేస్తమా ...
దరికి చేర్చు దారులు కూడా వున్నాయిగా ...
భారమెంతో ఉందని బాధపడకు నేస్తమా ...
బాధవెంట నవ్వులపంట ఉంటుందిగా ...
సాగరమథనం మొదలవగానే విషమే వచ్చింది
విసుగే చెందక కృషి చేస్తేనే అమృతమిచ్చింది
అవరోధాల దీవుల్లో ఆనంద నిధి ఉన్నది
కష్టాల వారధి దాటిన వారికే సొంతమౌతుంది
తెలుసుకుంటే సత్యమిది తలుచుకుంటే సాధ్యమిది ॥ మౌనం ॥

చ : చెమటనీరే చిందగ నుదిటిరాత మార్చుకో
మార్చలేనిది ఏదీలేదని గుర్తుంచుకో . . .
పిడికిలే బిగించగా చేతిగీత మార్చుకో . . .
మారిపోని కథలే లేవని గమనించుకో
తోచినట్టుగా అందరిరాతను బ్రహ్మేరాస్తాడు
నచ్చినట్టుగా నీ తలరాతను నువ్వేరాయాలి
నీ ధైర్యాన్ని దర్శించి దైవాలే తలదించగా
నీ అడుగుల్లో గుడికట్టి స్వర్గాలే తరుణించగా
నీ సంకల్పానికి ఆవిరి సైతం చేతులెత్తాలి
అంతులేని చరితలకి ఆది నువ్వుకావాలి ॥ మౌనం ॥

## 2. మనిషై పుట్టినవాడు కారాదు మట్టిబొమ్మ

చిత్రం : అడవిరాముడు | రచన : వేటూరి
సంగీతం : కె.వి. మహదేవన్ | గానం : ఎస్.పి. బాలు

సాకీ: మనిషై పుట్టినవాడు కారాదు మట్టిబొమ్మ
పట్టుదల వుంటే కాగలడు మరోబ్రహ్మ

ప : కృషి వుంటే మనుషులు ఋషులవుతారు మహాపురుషలౌవుతారు
తరతరాలకి తరగని వెలుగౌవుతారు ఇలవేల్పులౌతారు

చ : అడుగో అతడే వాల్మీకి - బ్రతుకు వేట అతనికి
అతి భయంకరుడు యమకింకరుడు అడవి జంతువుల పాలికి
అడుగో అతడే వాల్మీకి ...
పాలపిట్టల జంట వలపు తేనెల పంట
పండించుకొని పరవశించి పోయేవేళ
ఆ పక్షుల జంటకు గురి పెట్టాడు - ఒక పక్షిని నేల కూల్చాడు
జంట బాసిన పక్షి కంట పొంగిన గంగ
తన కంటిలో పొంగ మనసుకరగంగా
ఆ శోకంలో ఒక శ్లోకం పలికే
ఆ చీకటి ఎదలో దీపం వెలిగే ...
కరకు బోయడే అంతరించగా కవిగా ఆతడు అవతరించగా
మనిషి అతనిలో మేల్కొన్నాడు కడకు మహర్షే అయినాడు
నవరస భరితం రాముని చరితం
జగతికి ఆతడు పంచిన అమృతం
ఆ వాల్మీకి మీ వాడు - మీలోనే వున్నాడు
అక్షరమై మీ మనసు వెలిగితే మీలోనే వుంటాడు
అందుకే ... ॥కృషి॥

చ : ఏకలవ్యుడంటేనే ఎదురులేని బాణం
తిరుగులేని దీక్షకీ అతడే ప్రాణం
కులం తక్కువని విద్యనేర్పని గురువు బ్రహ్మగా మిగిలాడు
బొమ్మ గురుతుగా చేసుకొని బాణవిద్యలో వెలిగాడు
హుటాహుటిని ద్రోణుడప్పుడు తటాలుమని తరలివచ్చి
పక్షపాత బుద్ధితో దక్షిణ ఇమ్మన్నాడు
ఎదుట నిల్చిన గురుని పదమంటి
ఏమివ్వగల వాడననే ఏకలవ్యుడు
బొటనవేలివ్వమని కపటి ఆ ద్రోణుడు
వల్లె అనె శిష్యుడు చెల్లె ద్రోణుని ముడుపు
ఎరుకలవాడు అయితేనేమి గురిగలవాడే మొనగాడు
వేలునిచ్చి తన విల్లును విడిచి వేలుపుగా ఇలవెలిగాడు
అందుకే... ॥ కృషి ॥

చ :	శబరి ... ఇంతకాలం వేచినది ఈ పిలుపుకే
శబరి ... ఆశ పరువిడి అడుగు తడబడి రామ పాదముకన్నది
వంగిపోయిన నడుముతో నగుమోము చూడగలేక అపుడు
కనులను వీడి ఆ రామపాదము కడిగినది శబరి
పదముల ఒరిగినది శబరి
ప్రేమమీరగా రాముడప్పడు శబరి తల్లి కనులు తుడిచి
కోరి కోరి శబరి కొరికిన దోర పండ్లను ఆరగించే
ఆమె ఎంగిలి గంగకన్నా మిన్నగా భావించిన
రఘురాముడెంతటి ధన్యుడో - ఆ శబరిదెంతటి పుణ్యమో
ఆమె ఎవ్వరో కాదు సుమా - ఆడపడుచు మీ జాతికి
జాతి రత్నములు ఎందరెందరో మీలో కలరీనాటికి
అడవిన పుట్టి పెరిగిన కథలే అఖిల భారతికి హారతులు
నాగరికతలో సాగు చరితలో మీరే మాకు సారథులు అందుకే ...	॥కృషి॥

## 3. చీకటితో వెలుగే చెప్పెను నేనున్నానని

**చిత్రం : నేనున్నాను**	**రచన : చంద్రబోస్**

**సంగీతం : యం.యం. కీరవాణి**	**గానం : యం.యం. కీరవాణి, సునీత**

అతడు : చీకటితో వెలుగే చెప్పెను నేనున్నాననీ
ఓటమితో గెలుపే చెప్పెను నేనున్నాననీ
నేనున్నాననీ నీకేంకాదనీ నిన్నటి రాతనే మార్చేస్తాననీ	॥ చీకటితో ॥
తగిలే రాళ్లనీ పునాదిచేసి ఎదగాలనీ
తరిమే వాళ్లని హితులుగ తలచి ముందుకెళ్లాలనీ
కన్నుల నీటిని కలలసాటుకై వాడుకోవాలనీ
కాల్చేనిప్పని ప్రమిదగమలచి కాంతి పంచాలనీ
గుండెతో ధైర్యం చెప్పెను చూపుతో మార్గం చెప్పెను
అడుగుతో గమ్యం చెప్పెను నేనున్నాననీ
నేనున్నాననీ నీకేంకాదనీ నిన్నటిరాతనే మార్చేస్తాననీ ...
అతడు: ఎవ్వరు లేని ఒంటరిజీవికి తోడు దొరికిందనీ
ఆమె : అందరువున్నా అప్పుడు నీవై చేరువయ్యావనీ
అతడు : జన్మకు ఎరుగని అనురాగాన్ని పంచుతున్నావనీ
ఆమె : జన్మలు చాలని అనుబంధాన్ని పెంచుతున్నావని
అతడు : శ్వాసతో శ్వాసే చెప్పెను మనసుతో మనసే చెప్పెను
ఆమె : ప్రశ్నతో బదులే చెప్పెను నేనున్నాననీ
అతడు : నేనున్నాననీ నీకేంకాదని నిన్నటిరాతనే మార్చేస్తాననీ	॥ చీకటితో ॥

# 4. అపాయమ్ము దాటడాని కుపాయమ్ము కావాలీ ...

చిత్రం : శ్రీ కృష్ణ పాండవీయం | రచన : కొసరాజు
సంగీతం : టి.వి. రాజు | గానం : ఘంటసాల

అపాయమ్ము దాటడాని కుపాయమ్ము కావాలీ ...
అంధకార మలమినపుడు వెలుతురుకై వెదకాలీ ...
ముందుచూపు లేనివాడు ఎందునకూ కొరగాడు
సోమరియై కునుకువాడు సూక్ష్మమ్ము గ్రహించలేడు
మత్తువదలరా .... నిద్దుర మత్తువదలరా ॥ మత్తు వదలరా ॥
ఆ మత్తులోన బడితే గమ్మత్తుగ చిత్తవుదువురా..... ॥ మత్తువదలరా ॥
జీవితమున సగభాగం నిద్దురకే సరిపోవు ... ॥ జీవితమున ॥
మిగిలిన ఆ సగభాగం చిత్తశుద్ధి లేకపోవు ...
అతినిద్రాలోలుడు, తెలివిలేని మూర్ఖుడు ॥ అతి నిద్రాలోలుడు ॥
పరమార్థం గానలేక వ్యర్థంగా చెడతాడు ॥ మత్తు వదలరా ॥
సాగినంత కాలం నా అంతవాడు లేడందురు
సాగకపోతే ఊరక చతికిలబడిపోదురు
కండబలము తోటే ఘనకార్యం సాధించలేరు
బుద్ధిబలము తోడైతే విజయమ్ము వరింపగలరు ॥ మత్తు వదలరా ॥
చుట్టుముట్టు ఆపదలను మట్టుబెట్ట బూనుమురా॥ చుట్టు ముట్టు ॥
పిరికితనము కట్టిపెట్టి ధైర్యము చేపట్టమురా ...
కర్తవ్యము నీవంతు, కాపాడుట నావంతు ॥ కర్తవ్యము ॥
చెప్పడమే నా ధర్మం, వినకపోతే నీ ఖర్మం ॥ మత్తువదలరా ॥

**బంగారంలాంటి పాటల్లోని మాటలు**

మార్కుల కోసం ఏడవలేదురా ఎదిగిన ఏ సైంటిస్టూ
గుర్తు పట్టరా ఏ రంగంలో ఉందో నీ ఇంట్రస్టూ
నీక్కూడా వుండే వుంటుంది ఏదో ఒక టాలెంటు
నీకు నువ్వు బాసవ్వాలంటే దాన్ని బయటపెట్టు
రేసు హోర్సై లైఫ్ గెలిచే పరుగు మొదలుపెట్టు.

# 5. జయమ్ము నిశ్చయంబురా భయమ్ము లేదురా

చిత్రం : శభాష్ రాముడు | రచన : కొసరాజు
సంగీతం : ఘంటసాల | గానం : ఘంటసాల, సుశీల

అ : జయమ్ము నిశ్చయమ్మురా భయమ్ములేదురా
జంకుగొంకు లేక ముందు సాగిపొమ్మురా... సాగిపొమ్మురా
అ: ఏనాటికైన స్వార్థము నశించి తీరునూ ॥ 2 ॥
బృం : ఏ రోజుకైన సత్యమే జయించితీరునూ, జయించితీరునూ
అ : కష్టాల కోర్చుకొన్ననే సుఖాలు దక్కును,
బృం : సుఖాలు దక్కునూ ॥జయమ్ము ॥
అ : విద్యార్థులంతా విజ్ఞానం సాధించాలి బృం: విద్యార్థులంతా
విశాల దృష్టి తప్పకుండా బోధించాలి, బృం: బోధించాలి
పెద్దలనూ గౌరవించి పూజించాలి, బృం : పూజించాలి
అ&బృం : ॥ జయమ్ము ॥
ఆమె : జయమ్మురా భయమ్ములేదురా
జంకుగొంకు లేక ముందు సాగిపొమ్మురా ... సాగిపొమ్మురా
అ : కష్టాల కోర్చుకున్ననే సుఖాలు దక్కునూ, సుఖాలు దక్కునూ
ఈ లోకమందు సోమరులై ఉండకూడదూ, ఉండకూడదూ
పవిత్రమైన ఆశయాల మరువకూడదు, మరువకూడదూ ॥ జయమ్ము ॥
ఆమె : గృహాన్ని స్వర్గసీమగా చేయుముదేవా బ్రోవుముదేవా
కుటుంబమొక్క త్రాటి పైన నిలుపుము దేవా నడుపుముదేవా
బీదసాద నాదరించు బుద్ధి నొసగుమా శక్తి నొసగుమా ॥ జయమ్ము ॥
అ : గాండాంధ కారమలముకున్న భీతిచెందకు
సందేహపడక వెలుగు చూపి సాగుముందుకు, సాగుముందుకూ
నిరాశలోన జీవితాన్ని క్రుంగదీయకూ, క్రుంగదీయకూ ॥ జయమ్ము ॥
అ : పరాభవమ్ముకల్గనని పారిపోకుమోయ్ పారిపోకుమోయ్
జయమ్ము నిన్ వరించుదాక పోరి గెల్వవోయ్ పోరి గెల్వవోయ్
స్వతంత్రయోధుడన్నపేరు నిల్వబెట్టవోయ్ నిల్వబెట్టవోయ్ ॥జయమ్ము ॥
జయమ్మునిశ్చయమ్మురా ॥ 3 ॥

# 6. ఒకటే జననం - ఒకటే మరణం

**చిత్రం : భద్రాచలం** **సంగీతం : వందేమాతరం శ్రీనివాస్**

**రచన : సుద్దాల అశోక్ తేజ** **గానం : శంకర్ మహదేవన్, చిత్ర**

ఔట్ ఆఫ్ ది డార్క్‌నెస్ కేమ్ ది లైట్
ఆల్ లైట్ బిగెన్ ఇన్ ది డార్క్‌నెస్
వుయ్ ఆర్ ఆల్ మూవింగ్ టువార్డ్స్ ది లైట్ ... కమ్
స్టెప్ విత్ మి ఆన్ దిస్ జర్నీ ఆఫ్ లైఫ్ టైమ్

అ : ఒకటే జననం - ఒకటే మరణం
ఒకటే గమనం - ఒకటే గమ్యం
గెలుపు పొందేవరకు - అలుపులేదు మనకు
బ్రతుకు అంటే గెలుపు - గెలుపు కొరకే బ్రతుకు
కష్టాలు రానీ - కన్నీళ్ళు రానీ
ఏమైనా కానీ - ఎదురేది రానీ
ఓడిపోవద్దు - రాజీపడొద్దు
నిద్రే నీకొద్దు - నింగి నీ హద్దు ॥ఒకటే॥

ఆ : రాబోయే విజయాన్ని - పిడికిలిలో చూడాలి
ఆ గెలుపు చప్పట్లే - గుండెలలో మోగాలి
నీ నుదిటీ రేఖలపై - సంతకమే చేస్తున్నా
ఎదనిండా చిరునవ్వే - చిరునామై ఉంటున్నా
నిన్నే వీడని నీడవలే - నీతో వుంటా ఓ నేస్తం
నమ్మకమే మనకున్న బలం

అ : నీలి కళ్ళల్లో - మెరపు మెరవాలి, కారు చీకట్లో - దారి వెతకాలి
గాలి వానల్లో - ఉరుమై సాగాలి
తగిలే గాయాల్లో - ధ్యేయం చూడాలి . . . ॥ ఒకటే ॥

ఆ : నిదరోక నిలుచుంటా - వెన్నెలలో చెట్టువలె
నీకోసం వేచుంటా - కన్నీటి బొట్టువలె
అడుగడుగూ నీగుండె - గడియారం నేనవుతా
నువు నడిచే దారులలో - ఎదురొచ్చి శుభమౌతా
రాశిగ పోసిన కలలన్నీ - దోసిలి నిండా నింపిస్తా
చేతులు సాచిన స్నేహంలా . . .

అ : ముట్టుకున్నావా - మువ్వ అవుతుంది
పట్టుకున్నావా - పాటే అవుతుంది
అల్లుకున్నావా - జల్లె అవుతుంది
హత్తుకున్నావా - వెల్లువౌతుంది ॥ ఒకటే ॥

## 7. జగమంత కుటుంబం నాది ...

చిత్రం : చక్రం　　　　　　　　　　　　　　　　　రచన : సిరివెన్నెల

సంగీతం : చక్రి　　　　　　　　　　　　　　　　　గానం : శ్రీ

పల్లవి :జగమంత కుటుంబం నాది .... ఏకాకి జీవితం నాది (2)

సంసార సాగరం నాదే .... సన్యాసం శూన్యం నావే　　　　॥జగమంత॥

చరణం :1

కవినై ... కవితనై ... భార్యనై ... భర్తనై ... (2)

మల్లెలదారిలో ... మంచు ఎడారిలో (2)

పన్నీటి జయగీతాల ... కన్నీటి జలపాతాల

నాతో నేను అనుగమిస్తూ ... నాతో నేనే రమిస్తూ

ఒంటరినై అనవరతం .... కంటున్నాను నిరంతరం

కలల్ని ... కథల్ని ... మాటల్ని ... పాటల్ని ... రంగుల్ని ...

రంగవల్లుల్ని ... కావ్య కన్యల్ని ... ఆడపిల్లల్ని　　　　॥జగమంత॥

చరణం : 2

మింటికి కంటిని నేనై ... కంటను మంటను నేనై　　(2)

మంటల మాటున వెన్నెల నేనై. . . వెన్నెల పూతల మంటను నేనై

రవినై .... శశినై ... దివమై ... నిశినై ... నాతో నేను సహగమిస్తూ ...

నాతో నేను రమిస్తూ ... ఒంటరినై ప్రతినిముషం

కంటున్నాను నిరంతరం ... కిరణాల్ని కిరణాల ...

హరిణాల్ని హరిణాల ... చరణాల్ని చరణాల

చలనాన కనరాని గమ్యాల కాలాన్ని ... ఇంద్రజాలాన్ని　　　　॥జగమంత॥

చరణం : 3

గాలిపల్లకీలోన తరలి ... నా పాట పాప ఊరేగి వెడలె

గొంతువాకిలిని మూసి మరలి ... తను మూగవోయి నా గుండె మిగిలె

నా హృదయమే నా లోగిలి ... నా హృదయమే నా పాటకి తల్లి

నా హృదయమే ... నాకు ఆలి ... నా హృదయములో ఇది సినీవాలి

॥జగమంత॥

## 8. ఎవరేమి అనుకున్నా నువ్వుండే రాజ్యాన

చిత్రం : బడ్జెట్ పద్మనాభం | రచన : చంద్రబోస్

సంగీతం : ఎస్.వి. కృష్ణారెడ్డి | గానం : బాలు

ప : ఎవరేమి అనుకున్నా నువ్వుండే రాజ్యాన
రాజు నువ్వే బంటు నువ్వే మంత్రి నువ్వే సైన్యం నువ్వే
ఏమైనా ఏదైనా నువ్వెళ్ళే బడిలోన
పలకా నువ్వే బలపం నువ్వే ప్రశ్న నువ్వే బదులు నువ్వే
అన్నీ నువ్వే కావాలి అనునిత్యం పోరాడాలి, అనుకున్నది సాధించాలి
॥ఎవరేమి ॥

చ : అవమానాలే ఆభరణాలు అనుమానాలే అనుకూలాలు
సందేహాలే సందేశాలు ఛీత్కారాలే సత్కారాలు
అనుకోవాలీ అడుగేయాలీ ముళ్ళమార్గాన్ని అన్వేషించాలి
అలుపొస్తున్నా కలలేకన్నా పూల స్వర్గాన్ని అధిరోహించాలి
ఎవరికి వారే లోకంలో ఎవరికి పట్టని శోకంలో నీతో నువ్వేసాగాలి
॥ఎవరేమి॥

చ : బలము నువ్వే బలగం నువ్వే ఆటా నీదే గెలుపూ నీదే
నారు నువ్వే నీరు నువ్వే కోతా నీకే పైరూ నీకే
నింగిలోన తెల్లమేఘం నల్లబడితేనే జల్లులు కురిసేది
చెట్టుపైనా పూలు మొత్తం రాలిపోతేనే పిందెలు కాసేది
ఒక ఉదయం ముందర చీకట్లు,
విజయం ముందర ఇక్కట్లు రావడమన్నది మామూలు
॥ఎవరేమి॥

**బంగారంలాంటి పాటల్లోని మాటలు**

ఇష్టం వుంటే చేదు కూడా తీయనే
కష్టం అంటే దూది కూడా భారమే
లక్ష్యమంటు లేని జన్మే దండగా
లక్షలాది మందిలేరా మందగా
పంతంపట్టి పోరాడందే కోరిన వరాలు పొందలేవు కదా!

# 9. ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి

**చిత్రం : పట్టుదల** | **రచన : సిరివెన్నెల**

**సంగీతం : ఇళయరాజా** | **గానం : కె.జె. ఏసుదాస్**

ప : ఎప్పుడూ ఒప్పుకోవద్దురా ఓటమి
ఎప్పుడూ వదులుకోవద్దురా ఓరిమి
విశ్రమించవద్దు ఏ క్షణం - విస్మరించవద్దు నిర్ణయం
అప్పుడే నీ జయం నిశ్చయంరా .. ॥ ఎప్పుడూ ॥

చ : నొప్పిలేని నిమిషమేది జననమైనా మరణమైనా
జీవితాన అడుగడుగునా .....
నీరసించి నిలిచిపోతే నిమిషమైనా నీది కాదు
బ్రతుకు అంటే నిత్య ఘర్షణ ....
దేహముంది ప్రాణముంది నెత్తురుంది సత్తువుంది
ఇంతకన్న సైన్యముండునా
ఆశ నీకు అస్త్రమౌను శ్వాస నీకు శస్త్రమౌను
దీక్షకన్నా, సారధెవురురా ...
నిరంతరం ప్రయత్నమున్నదా నిరాశకే నిరాశ పుట్టదా
నిన్ను మించి శక్తి ఏది నాకె నువ్వు బాసటైతే ॥ ఎప్పుడూ ॥

చ : నింగి ఎంత గొప్పదైనా రివ్వుమన్న గువ్వపిల్ల
రెక్కముందు తక్కువేనురా ...
సంద్రమెంత పెద్దదైనా ఈదుతున్న చేపపిల్ల
మొప్పముందు చిన్నదేనురా ...
పిడుగువంటి పిడికిలెత్తి ఉరుమువల్లె హుంకరిస్తే
దిక్కులన్ని పిక్కటిల్లురా
ఆశయాల అశ్వమెక్కి అదుపులేని కదంతొక్కి
అవధులన్ని అధిగమించరా
నీ విక్రమా పరాక్రమించరా విశాల విశ్వమాక్రమించరా
జలధిసైత మాపలేని జ్వాల ఓలె ప్రజ్వలించరా
॥ఎప్పుడూ॥

# 10. ఎవరో ఒకరు ఎపుడో అపుడు

చిత్రం : అంకురం — రచన : సిరివెన్నెల

సంగీతం : హంసలేఖ — గానం : ఎస్.పి.బాలు, చిత్ర

ప : ఎవరో ఒకరు ఎపుడో అపుడు
నడవరా ముందుగా అటో ఇటో ఎటోవైపు ॥2॥
మొదటివాడు ఎప్పుడూ ఒక్కరే మరి
మొదటి అడుగు ఎప్పుడూ ఒంటరే మరి
వెనుక వచ్చు వాళ్ళకు బాట అయినది ॥ఎవరో॥

చ : కదలరు ఎవ్వరూ వేకువ వచ్చినా
అనుకుని కోడికూత నిదురపోదుగా
జగతికి మేలుకొలుపు మానుకోదుగా
మొదటి చినుకు సూటిగా దూకి రానిదే
మబ్బుకొంగు చాటుగా
ఒదిగి దాగితే
వానధార రాదుగా నేల దారికి
ప్రాణమంటు లేదుగా బ్రతకటానికి ... ॥ ఎవరో ॥

చ : చెదరకపోదుగా చిక్కని చీకటి
మిణుగురు రెక్కచాటు చిన్నకాంతికి
దానికి లెక్కలేదు కాళరాతిరి
పెదవి ప్రమిద నిలపనీ - నవ్వు జ్యోతినీ
రెప్పవెనక ఆపనీ - కంటి నీటిని
సాగలేక ఆగితే దారికరుగునా
జాలి చూపి తీరమే దరికి చేరునా ॥ ఎవరో ॥

చ : యుగములు సాగినా నింగిని తాకక
ఎగిసిన అలల ఆశ అలసిపోదుగా
ఓటమి ఒప్పకుంటూ ఆగిపోదుగా
ఎంతవేడి ఎండతో ఒళ్ళు మండితే
అంత వాడి ఆవిరై వెళ్ళి చేరదా
అంత గొప్ప సూర్యుడి కళ్ళుమూయగా
నల్లమబ్బు కమ్మితే చల్లబారడా ॥ ఎవరో ॥

## 11. ప్రపంచమే కాదన్నా పైనున్నోడే రాకున్నా

చిత్రం : భగీరథ　　　　　　　　　　　రచన : చంద్రబోస్

సంగీతం : చక్రి　　　　　　　　　　　గానం : శంకర్ మహదేవన్

ప :　ఓ ... ఓ ... ఓ ...　ఓ ...　ఓ ...　॥4॥

ప్రపంచమే కాదన్నా పైనున్నోడే రాకున్నా - నీతో వుండే దైవం నేస్తంరా
అదృష్టమేలేకున్నా నీ కష్టమే తనదన్నా - నీలో వుండే ప్రాణం నేస్తంరా
పాపలా నువ్వున్నచో తను కన్నురా ...
పాదమై నువ్వున్నచో తను మన్నురా ...
వెలుగుల్లోనే కాదు చీకట్లో నీ నీడరా
ఈ చోటనే కాదు స్వర్గాన నీతోడురా ...　　　　　　॥ ఓ.. ఓ.. ॥

చ:　త్యాగాలే చేసేది త్యాగాలే అడిగేది - త్యాగంలో బ్రతికేది స్నేహమే
లోపాలే చూసేది ఆ పై సరిచేసేది - లాభాలు చూడనిది స్నేహమే ...
పంచేకొద్ది మించిపోయే నిధి - తాగేకొద్ది పొంగిపోయే నది ॥ 2 ॥
ఇద్దరకిద్దరు రాజులు ఏలే రాజ్యం స్నేహోనిది
యుద్ధాలున్న శాంతిని నిలిపే సైన్యం స్నేహనిది　　　　　　॥ ఓ.. ఓ.. ॥

చ :　విశ్వాసం తొలిమెట్టు విశ్వాసం మలిమెట్టు
విశ్వాసమే చివరంటూవున్నది
ఆకాశం హద్దైనా వినువీధే తనదైనా
ఈ భూమే నెలవంటూ అన్నది
కాలంకన్నా ఇది విలువైనది సత్యంకన్నా ఇది నిజమైనది ॥ 2 ॥
మనసున దాగిన మనసును చూపే ఆకృతి స్నేహోనిది
మనిషిని పూర్తిగా మనిషిగా మార్చే సంస్కృతి స్నేహోనిది
ఓ...ఓ...ఓ...ఓ...ఓ... ॥4॥
లాలించగా అమ్మల్లే పాలించగా నాన్నల్లై...
లభించిన వరమే నేస్తంరా...
ఆడించగా అన్నల్లే బోధించగా గురువల్లే
జపించని ఋణమే నేస్తంరా ...
పాపలా నువ్వున్నచో తను కన్నురా ...
పాదమై నువ్వున్నచో తను మన్నురా ...
వెలుగుల్లోనే కాదు చీకట్లో నీ నీడరా
ఈ చోటనే కాదు స్వర్గాన నీతోడురా...
ఓ...ఓ...ఓ...ఓ...ఓ...　॥4॥

## 12. నీతికి నిలబడి నిజాయితీగా పదరా ముందుకు పదరా

**చిత్రం : పూలరంగడు (1967)** **రచన : కొసరాజు**

**సంగీతం : ఎస్.రాజేశ్వరరావు** **గానం : ఘంటసాల**

ఓహో..........ఓ............ఓ...............ఓహో.................ఓ.................హేయ్

నీతికి నిలబడి నిజాయితీగా పదరా ముందుకు పదరా

పదరా ముందుకు పదరా..... ॥నీతికి॥ అహా చల్‌రే బేటా చల్‌రే

1. తాతల తండ్రుల, అర్జన తింటూ జల్సాగా నువ్వు తిరగకురా

హోయ్ ॥ తాతల ॥

కండలు కరగగ కష్టం చేసి తలవంచక జీవించుమురా

పూలరంగడిగ వెలుగుమురా.........హ..........య్యు ॥నీతికి ॥

2. పెంచిన కుక్కకు రొట్టె మేపుతూ హుషారుగా ఒకడున్నాడు

బల్ ఖుషీ ఖుషీగా ఉన్నాడు ...

కన్నబిడ్డకు గంజిదొరకక ఉసూరుమని ఒకడున్నాడు, చల్‌చల్‌రే.. ॥నీతికి॥

3. ఉన్నవాడికి అరగని జబ్బు, లేనివాడికి ఆకలిజబ్బు ॥ఉన్నవాడికి॥

ఉండీలేని మధ్యరకానికి చాలీచాలని జబ్బురా

ఒకటే అప్పుల జబ్బురా .....హ.....య్యు ॥నీతికి॥

4. కష్టాలెన్నో ముంచుకువచ్చిన కన్నీరును ఒలికించకురా

కష్టజీవుల కలలు ఫలించే కమ్మని రోజులు వచ్చునురా

చివరకు నీదే విజయమురా ॥నీతికి॥

## 13. ఎవ్వడి కోసం ఎవడున్నాడు పొండిరా పొండి

**చిత్రం : ధర్మదాత (1970)** **రచన : సి. నారాయణరెడ్డి**

**సంగీతం : టి. చలపతిరావు** **గానం : ఘంటసాల**

ఎవ్వడి కోసం ఎవడున్నాడు పొండిరా పొండి

నా కాలం ఖర్మం కలిసొస్తేనే రండిరా రండి ॥ నా కాలం ॥ ॥ఎవ్వడి॥

1. ఉన్నవాడిదే రాజ్యమురా, లేనివాడి పని పూజ్యమురా

మనుషులలోనా... మమతలు లేవూ...

మంచితనానికి రోజులు కావు ॥మనుషులలోనా॥

అంతా స్వార్థం, జగమంతా స్వార్థం ॥ఎవ్వడి॥

2. ఒకడికి నే తలవంచనురా, బానిసగా జీవించనురా
మిన్ను విరిగి పైబడినాగాని అవమానాన్ని సహించనురా ...
ఒరేయ్ ఉంటే, వేళకు తింటారా, లేకుంటే పస్తులు ఉంటా... ఒరేయ్ ఒరేయ్
మిమ్ము నమ్ముకుని పుట్టానా, మీరుద్ధరింతురనుకొన్నావా...
॥మిమ్ము॥
హు...పోతున్నారా... వెళిపోతున్నారా... ॥ఎవ్వడి॥

3. కాలం మారకపోతుందా, కష్టం తీరకపోతుందా...
అదృష్టమన్నది ఇంటికి వచ్చి తలుపులు తట్టకపోతుందా
అప్పడు మీరేమంటారు, మా నాన్న, మా నాన్న, మా బాబే అంటూ
నీడకు చేరే పక్షుల్లాగా, బెల్లంచుట్టూ ఈగల్లాగ ॥నీడకు॥
మూగక పోరు, నే చూడకపోను ॥ఎవ్వడి॥

## 14. ఎవరికీ తలవంచకు ఎవరినీ యాచించకు

**చిత్రం : నిండు సంసారం (1968)** **రచన : సి. నారాయణ రెడ్డి**
**సంగీతం : మాష్టర్ వేణు** **గానం : ఘంటసాల**

ప) : ఎవరికీ తలవంచకు ఎవరినీ యాచించకు
గుండెబలమే నీ ఆయుధం నిండుమనసే నీధనం ॥ఎవరి॥

చ1) : కండలుపిండే కష్టజీవులకు తిండికి కరువుంటుందా
మంచితనమ్మును మించిన పెన్నిధి మనిషికీ వేరేవుంటుందా ॥ఎవరి॥

చ2) : చాలీచాలని జీతంతో మిడిమేలుపు కొలువులు కొలువకు
ముడుచుకుపోయిన ఆశలతో మిడి మిడి బ్రతుకులు గడపకు
చీకటి రాజ్యం ఎంతోకాలం చలాయించదని మరువకు ॥ఎవరి॥

చ3) : జీవితమే ఒక వైకుంఠపాళీ నిజం తెలుసుకోభాయీ
ఎగరేసే నిచ్చెనలేకాదు పడదోసే పాములూ వుంటాయి
చిరునవ్వులతో విషవలయాలను భేదించి ముందుకు పదవోయి
॥ ఎవరి ॥

## 15. మంచిని మరచి వంచన నేర్చి

చిత్రం : ఒకే కుటుంబం రచన : దాశరథి

సంగీతం : యస్.పి. కోదండపాణి గానం : ఘంటసాల

ప) : మంచిని మరచీ వంచన నేర్చీ
నరుడే ఈనాడూ వానరుడైనాడూ, వానరుడైనాడూ ॥ మంచిని ॥

చ1) : చదువూ తెలివీ పెంచాడూ చంద్రలోకము జయించాడూ
నీతులు చెప్పి గోతులు తవ్వి పాతాళానికి జారాడూ
మెదడే పెరిగి హృదయం తరిగి నరుడే ఈనాడూ
వానరుడైనాడూ వానరుడైనాడూ ॥ మంచిని ॥

చ2) : అందరి చెమటా చిందించాడు సంపద యెంతో పెంచాడూ ॥ 2 ॥
పంపక మంటూ వచ్చేసరికి అంతా తనదే అన్నాడు
ధనమే హెచ్చి గుణమే చచ్చి నరుడే ఈనాడూ
వానరుడైనాడు, వానరుడైనాడూ. ॥ మంచిని ॥

## 16. మానవుడే మహనీయుడు మానవుడే మహనీయుడు

చిత్రం : బాలభారతం రచన : ఆరుద్ర

సంగీతం : ఎస్. రాజేశ్వరరావు గానం : ఘంటసాల

ప : మానవుడే మహనీయుడు మానవుడే మహనీయుడు
శక్తియుతుడు యుక్తిపరుడు మానవుడే మాననీయుడు
మానవుడే మహనీయుడు
మంచిని తలపెట్టినచో మనిషికడ్డులేదులే
ప్రేరణ దైవానిదైన సాధించెను నరుడే
మానవుడే మహనీయుడు మానవుడే మహనీయుడు

చ : దివిజ గంగ భువి దించిన భగీరథుడు మానవుడే
సుస్థిర తారగ మారిన ధృవుడు కూడా మానవుడే
సృష్టికి ప్రతిసృష్టి చేయు విశ్వామిత్రుడు నరుడే
జీవకోటి సర్వములో శేష్టత్తముడు మానవుడే
మానవుడే మహనీయుడు మానవుడే మహనీయుడు

చ :  గ్రహరాశులనధిగమించి ఘనతారల పథమునుంచి
గ్రహరాశులనధిగమించి ఘనతారల పథమునుంచి
గగనంతార రోదసిలో గంధర్వగోళ సతుల దాటి
చంద్రలోకమైన దేవేంద్రలోకమైనా
చంద్రలోకమైన దేవేంద్రలోకమైనా
బొందితో జయించి మరల భువికి తిరిగి రాగలిగె
మానవుడే మహనీయుడు మానవుడే మహనీయుడు

---

## 17. కలకానిది విలువైనది బ్రతుకు

**చిత్రం : వెలుగు నీడలు** — **రచన : శ్రీశ్రీ**
**సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు** — **గానం : ఘంటసాల**

కలకానిది, విలువైనది : బ్రతుకు;
కన్నీటి ధారలలోనే బలిచేయకు ॥ కలకానిది ॥
గాలి వీచి పూవుల తీగ నేలవాలి పోగా, (2)
జాలివీడి, యటులే దాని వదిలివైతువా?
చేరదీసి నీరుపోసి చిగురించనీయవా!? ॥ కలకానిది ॥
అలముకున్న చీకటిలోనే అలమటించనేల, (2)
కలతలకే లొంగిపోయి కలువరించనేల ?
సాహసమను జ్యోతిని చేకొనే సాగిపో ! ॥ కలకానిది ॥
అగాధమౌ జలనిధిలోన ఆణిముత్యమున్నటులే
శోకాల మరుగున దాగి సుఖమున్నదిలే ॥ అగాధమౌ ॥
ఏదీ తనంత తానై నీ దరికి రాదు.
శోధించి సాధించాలి; అదియే ధీరగుణం ॥ కలకానిది ॥

**ఒక వ్యక్తి ఆత్మహత్య చేసుకోబోతూ ఈ పాట విని ఆత్మహత్యా ప్రయత్నాన్ని మానుకున్నాడని శ్రీ శ్రీ గారు చెప్పారు.**

1. ఎవరైనా కష్టాలలో సోలిపోతే వాళ్లను లేవదీసి ఉద్ధరించాలి.
2. నిరాశ, చీకటి ఆవరించినప్పడు సాహసం అనే జ్యోతిని చేతబట్టి వాటిని నిర్జించాలి.
3. 'మంచి' అనేది ఏదీ కూడా దానంతట అది నీకు దొరకదు. శోధించి సాధించుకోవడం మన వంతు కర్తవ్యం.

## 18. ఉందిలే మంచికాలం ముందుముందునా

చిత్రం : రాముడు - భీముడు 　　 రచన : శ్రీశ్రీ

సంగీతం : పెండ్యాల నాగేశ్వరరావు 　　 గానం : ఘంటసాల, సుశీల, మాదవపెద్ది సత్యం

అతడు :ఉందిలే మంచికాలం ముందుముందునా
అందరూ సుఖపడాలి నందనందనా ॥ 2 ॥

ఆమె : ఉందిలే మంచికాలం ముందు ముందునా 　　 కోరస్ : ఉందిలే

ఆమె : ఎందుకో - సందేహమెందుకో రానున్న విందులో
నీవంతు అందుకో ॥ 2 ॥ ఎందుకో ॥

ఆమె : ఆరోజూ అదిగో, కలదూ - నీ ఎదుట నీవే రాజువటా
కోరస్ : ఆఁఆ ॥ఉందిలే॥

అతడు : ఏమిటేమిటేమిటీ మంచి కాలమంటున్నావు ఎలాగుంటుందది విశదంగా చెప్పు

ఆమె : దేశ సంపద పెరిగేరోజు మనిషి మనిషిగా బ్రతికేరోజు ॥దేశ॥
గాంధీ మహాత్ముడు కలగన్నరోజు

అంతా: నెహ్రూ మహాత్ముడు నెలకొల్పురోజు
ఆరోజెంతో దూరంలేదోరన్నయ్యో
అదిగోచూడూ రేపేనేడు చిన్నయ్యో ॥ఆరోజెంతో॥

అతడు : భలేభలే బాగా చెప్పావు కాని అందుకు మనమేం
చేయాలో అదికూడా నువ్వే చెప్పు

అతడు : అందరికోసం ఒక్కడు నిలిచి ఒక్కనికోసం అందరు కలసి

ఆమె : అందరికోసం ఒక్కడు నిలిచి ఒక్కని కోసం అందరు కలిసి

అతడు : సహకారమే మన వైఖరి అయితే
ఉపకారమే మన ఊపిరి అయితే

ఇద్దరు : పేదా గొప్ప భేదంపోయీ అందరూ నీది నాదని వాదం మానివుందురు

ఆమె : ఆరోజెంతో దూరంలేదోరన్నయ్యో అదిగోచూడూ రేపేనేడు చిన్నయ్యో

ఆమె : తీయగా బ్రతుకంత మారగా కష్టాలు తీరగా సుఖశాంతులూరగా

అతడు : ఆకాశ వీధులు ఎదురేలేకుండా ఎగురును మనజెండా

కోరస్ : ఆ......ఆ......

అంతా : ఉందిలే మంచికాలం ముందు ముందు నా
అందరూ సుఖపడాలి నందనందనా.

## నా మాట

**" My whole ambition in life is to set in motion a machinery which will bring noble ideas to the door of everybody... " - *Swami Vivekananda***

ఈ ఉదాత్త ఆశయమే మాకు స్ఫూర్తి.

మంచిదైతేనే కదా, మనసు పరవశిస్తుంది. ఆనందాన్ని పొంది, ఆ ఆనందాన్ని అందరికీ పంచివ్వాలనే నిస్వార్థగుణానికి అంకురార్పణ చేస్తుంది. వ్యక్తి వికసిస్తేనే సమాజం బాగుపడుతుంది. సమాజం బాగుపడితేనే వ్యక్తులు మరింకింత వికసించడానికి దోహదపడే పరిస్థితులు ఏర్పడతాయి. అందరి బాగును కోరనిదేదైనా ఎవ్వరికీ మేలు చేయదు. సంగీతమైనా, సాహిత్యమైనా, మరేదైనా, ఏమిటి వీటి పరమార్థం? జీవితం యొక్క అర్థాన్ని విడమరచి చెప్పి, జీవితంలోని ఆటుపోటుల పరమార్థాన్ని వివరించి చెప్పి, మేలు మలుపులను ఆహ్వానించమనీ, తప్పదారులు, అడ్డదారులు వద్దనీ, ఓటమి ఎదురైనా నిరుత్సాహపడకుండా, పట్టు సడలకుండా సాధించి చూపాలనీ, గౌరవంగా బతకాలనీ, ఇతరులకు స్ఫూర్తినిచ్చేలా జీవించాలనీ, కష్టపడి ఎదగాలనీ, విజయం అందించిన తృప్తి వెలిగించిన చిరునవ్వులు మణిదీపాలుగా ముఖాలపై కాంతులు విరజిమ్మాలనీ....

ఆయా సన్నివేశాలకు అనుగుణంగా వ్రాయబడినవే అయినా, పదికాలాలపాటు మిగిలే సాహిత్యపు విలువలను సంతరించుకుని, ఏతరం వారినైనా ఆకట్టుకుని పరవశాన్ని కలిగిస్తూనే, పరమార్థాన్ని గుర్తుకు తెచ్చే మధురమైన పాటల, మేటి సంకలనం - ఈ సమర్పణ.

1. తొడుపునూరి ఫ్రెండ్స్, సికింద్రాబాద్ వారు చేసిన తొలి ప్రయత్నానికి ఇది నూతన రూపం. నాకు అనుమతి నిచ్చినందుకు మనసారా కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాను.

2. ఈ పాటల రచయితలకు, సినీ నిర్మాతలకు కృతజ్ఞతలు.

3. శ్రీ బాలాజీ పబ్లికేషన్స్, విజయవాడ, శ్రీ చౌదరిగారికి కృతజ్ఞతలు.

నాకు నచ్చిన కొన్ని పాటలను మీతో ఆనందంగా పంచుకుంటున్నాను. నాకు తోచని పాటలు గానీ, పాటలలోని చరణాలు గానీ అనేకం ఉండవచ్చు. శ్రమ అనుకోక వాటిని నాకు తెలియపరుస్తే, ఈ ప్రయత్నం మీ అభిమానాన్ని చూరగొంటే, మరోసారి సాహసించటానికి మీవంతు తోడ్పాటును అందించిన వారవుతారు. రండి ముందుకు రండి. మంచిని పెంచే, ఆనందాన్ని పంచే ఈ ప్రయత్నానికి మీ చేయూత నందిస్తారని ఆశిస్తూ...

విజయదశమి, విన్నవిస్తూ...

28 సెప్టెంబర్, 2009 "సర్వేజనాః సుఖినోభవన్తు" **వేగేశ్న గోవిందరాజు**

---

**జీవితంలో స్ఫూర్తి పొంది విజయం సాధించడానికి, పరిపూర్ణ వ్యక్తిత్వ వికాసానికి . . .**

## "పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ"

1. శ్రీ యండమూరి వీరేంద్రనాథ్‌గారు (విజయానికి అయిదు మెట్లు), 2. డా॥ బి.వి.పట్టాభిరామ్‌గారు (టర్నింగ్ పాయింట్), 3.శ్రీ సి.నరసింహారావుగారు (వ్యక్తిత్వ వికాసం), 4. శ్రీ కంఠంనేని రాధాకృష్ణమూర్తిగారు (అదృష్టం), 5.శ్రీ ఎ.జి.కృష్ణమూర్తిగారు (ధీరూభాయిజమ్), 6. డా॥ వి.నాగేష్ గారు (ఆనందానికి ఆరు అడుగులు),7. శ్రీ గంపా నాగేశ్వర్‌రావుగారు (పదండి ముందుకు విజయం మీదే), 8.శ్రీ ఆకెళ్ళ రాఘవేంద్రగారు (మీరు సామాన్యులు కారు), 9. ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారు (మీ మార్గం – మీ గమ్యం), 10. శ్రీ రాబిన్ శర్మగారు (ఆస్తులు అమ్ముకుని ఆత్మ శోధనకై ఒక యోగి ప్రస్థానం), మరియు అనేక ఇతర రచయితల తెలుగు, ఇంగ్లీషు "వ్యక్తిత్వవికాస పుస్తకాలు" (దాదాపు 630) (రూ.45,000/– వెల గలవి) మీకు అందుబాటులో వున్నాయి. మీ కోసం ఎదురు చూస్తున్నాయి.

... 3వ టైటిల్ పేజీలో.... >

<... 2వ టైటిల్ పేజీ నుండి....

ఈ **"పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ"** ప్రధాన ఉద్దేశ్యం...

**1. ప్రేరణ :** శ్రీ యండమూరి వీరేంద్రనాథ్ గారు రచించిన "విజయానికి అయిదు మెట్లు" పుస్తకం ద్వారా నా జీవితం ఆనందమయంగా మారినందుకు కృతజ్ఞతా భావంతో... ఈ **"పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ"** ద్వారా మరి కొంతమందైనా, జీవితంలో ఇప్పుడు ఉన్నస్థాయి నుండి అత్యున్నత స్థాయికి వీలైనంత తొందరగా చేరుకోవాలనే ఆశయంతో ప్రారంభించబడింది.

**2. ఆశయం : "పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ"** జీవిత చందా దారులందరిచేత మంచి పుస్తకాలను చదివించాలనే ఆశయంతో, సేవాభావదృక్పథంతో ప్రారంభించాం.

**3. సేవాభావం : "పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ"** లో ఉన్న పుస్తకాలలో 2 లేక 3 పుస్తకాలు (రూ.500/- విలువకు మించకుండా) మీరు చదవటానికి ఉచితంగా తీసుకుని, 30 నుండి 90 రోజులలో తిరిగి ఇచ్చి, వేరే పుస్తకాలను తీసుకోవచ్చును.

**4. జ్ఞానయజ్ఞం :** టి.వి., కంప్యూటర్, ఇంటర్నెట్, సెల్‌ఫోన్‌ల స్పీడు యుగంలో చదివే అలవాటు తగ్గిపోతున్న ఈ రోజులలో "పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ"/ "పూలబాట ప్రచురణ"ల ద్వారా లాభాపేక్ష లేకుండా ఎక్కువమందితో ఎక్కువ పుస్తకాలు చదివించాలనే సహృదయంతో చేసే "జ్ఞానయజ్ఞం" లో మీరు భాగస్వాములై మీ సహృదయ సహకారాలను అందించండి.

**5. సభ్యత్వం :-** జీవిత చందాదారులుగా చేరాలనుకునేవారు ఎవరైనా, ఎప్పుడైనా రూ.500/- (చెక్/ క్యాష్) రూపంలో ఇవ్వవచ్చును. ఈ విషయాలు మీకు నచ్చినట్లయితేనే, **'మనస్ఫూర్తిగా మంచి పుస్తకాలు చదువుతాను'** అని అనుకుంటేనే జీవిత చందాదారులుగా చేరండి. జీవిత చందాదారులుగా చేరిన వెంటనే " లైబ్రరీ పుస్తకాల లిస్ట్" అందిస్తాము.

**6. విరాళం :-** "పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ" కి సహృదయులు ఎవరైనా ముందుకు వచ్చి తమ వంతుగా ఎంత మొత్తంలోనైనా (కనీసం 9 రూ) డబ్బు విరాళంగా ఇచ్చి రశీదుని పొందవచ్చును. మీరిచ్చిన మొత్తంతో మంచి పుస్తకం / పుస్తకాలు కొని, దానిమీద మీ పేరు వ్రాసి "పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ" లో చేర్చబడును.

**7. ఉచితం :** "పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ" జీవిత చందా దారులందరికీ రాబోయే రోజులలో వచ్చే "పూలబాట ప్రచురణలు" ఉచితంగా ఇవ్వబడతాయి.

**8. పూలబాట ప్రచురణలు :** నామమాత్రమైన ఖర్చుతో, ఈ పుస్తకాలను అందుకోండి. మీ మిత్రులకు అమూల్యమైన కానుక, అందించండి. మానవతా విలువలతో కూడిన వ్యక్తిత్వ వికాసంపై పుస్తకాలు. రచయితలు : **ప్రొ॥ వంగపల్లి విశ్వనాథం. డా॥జి. ఎల్.కె. దుర్గ, వేగేశ్న గోవిందరాజు**

**1. మీ మార్గం - మీ గమ్యం - 20 పేజీలు వెల రూ. 3/-** 2. Personality Development-20 Pages Rs.4/- 3. You & Your life-28 Pages Rs. 5/- **4. వ్యక్తిత్వ వికాసం- 36 పేజీలు వెల రూ. రూ.6/- 5. 369 మంచి ముత్యాలు-20 పేజీలు వెల రూ.4/-, 6. మీ జీవితంలో ఉందిలే మంచి కాలం ముందు ముందునా - 20 పేజీలు వెల రూ.5/-, 7. 369 మంచి మాణిక్యాలు - 20 పేజీలు వెల రూ.4/-** మీకు కావలసిన కాపీలకు మా చిరునామాకు V.Sridevi అనే పేరు మీద పుస్తకాల ఖరీదు మాత్రమే మనీ ఆర్డరు, బ్యాంక్ డ్రాఫ్టు, హైద్రాబాద్ లోకల్ బ్యాంక్ చెక్కుగాని పంపించండి. పుస్తకాలు పోస్టు పార్శిలు ద్వారా పంపించబడతాయి.రవాణా ఖర్చులు మేమే భరిస్తాము. M.O. కూపన్‌లో మీ చిరునామా, ఫోన్ నెంబరు, మీకు కావలసిన పుస్తకాల పేర్లు, కావలసిన ప్రతుల సంఖ్య తప్పక వ్రాయండి. (లేదా) "**POOLABATA CIRCULATION LIBRARY**" అనే పేరు మీద ఈ క్రింది బ్యాంక్ అకౌంటులో నేరుగా deposit చేయవచ్చు. Bank of Maharashtra - Kukatpally Branch (Hyd) Code : 1175 **Current A/c. No. 6000 170 9359**

# పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ



ప్రేమ సేవ

**శుభారంభం :** శ్రీమతి అత్తలూరి విజయలక్ష్మిగారు సత్సంకల్పంతో, ఆర్థిక సహాయంతో ఈ **"పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ"** ని 15-8-2007 న ప్రారంభించడానికి ప్రేరణ నిచ్చారు. సహృదయంతో విరాళాలు ఇచ్చినవారికి, (69 మంది స్నేహితులు) జీవిత చందా దారులందరికీ (93 మంది సభ్యులు) హృదయ పూర్వక కృతజ్ఞతాంజలి. - 28-09-2009.

---

**"పూలబాట సర్క్యులేషన్ లైబ్రరీ" ప్రతీ ఆదివారం**

**సమయం: ఉ॥ 8 గం॥ల నుండి రాత్రి 8 గం॥ల వరకు**

ప్రచురణల ప్రతులకు, ఇతర వివరాలకు : శ్రీమతి వి. శ్రీదేవి, ఫ్లాట్ నెం. 405/బి, రాధాకృష్ణ ఎస్టేట్స్, బ్యాంక్ ఆఫ్ మహారాష్ట్ర బిల్డింగ్, రెమెడి హాస్పిటల్ రోడ్, కె.పి.హెచ్.బి. కాలని, హైదరాబాద్-072.

ఫోను : 040-2305 5349 సెల్ : **99891 85023,** 99638 96823

**"లోకాస్సమస్తాః సుఖినోభవన్తు"**

## SUCCESS ATTAINMENT INSPIRATION

(Personality Development Course)

You can avail the opportunity of attending the **FREE** Lectures, on Personality Development by Professional Speakers on the FOURTH SUNDAY of every month, between 2-00 and 5-00 p.m.

**SRI SHIRIDI SAI BABA SANSTHAN**

at Meditation Hall, First Floor, Temple Premises, Shivam Road, Lane Beside A.T.I., Bagh Amberpet, Hyderabad Ph Nos. 040-27424824/040-65696983

**ALL ARE INVITED**

## యువభారతి

నగర కేంద్ర గ్రంథాలయ సంస్థ సంయుక్త ఆధ్వర్యంలో

**ప్రతినెలా, మొదటి ఆదివారం,**

**మధ్యాహ్నం 2-00 గంటల నుండి 5-00 గంటల వరకు,** చిక్కడపల్లి, అశోక్‌నగర్‌లో వున్న నగరకేంద్ర గ్రంథాలయంలో, యువభారతి సమావేశకర్త ఆచార్య వంగపల్లి విశ్వనాథం తెలుగులో నిర్వహిస్తున్న వ్యక్తిత్వ వికాస ఉపన్యాసాలకు **అందరూ ఆహ్వానితులే, ప్రవేశం : ఉచితం.**

**ఆచార్య వంగపల్లి విశ్వనాథం గారి ఉపన్యాసాలు మరియు స్లైడ్స్** : వేర్వేరు సందర్భాలలో, వివిధ సంస్థలలో, వ్యక్తిత్వ వికాసానికి సంబంధించిన అనేక అంశాలపై, తెలుగు / ఇంగ్లీష్‌లలో చేసిన ప్రసంగాలను ఉచితంగా, ఇంటర్ నెట్‌లో వినడానికి, "Power Point Presentation" లను చూడటానికి

Please visit : http ://www.**archive.org** లో search : Prof. V. Viswanadham;
www.**scribd.com** లో search : Viswam.vangapally 4581

మీ అభిప్రాయాలను తెలుపండి. మీ మిత్రులకు ఈ ఉచిత సదుపాయం గురించి తెలియపరచండి.

VAKDEVI, ✆ +91-40-27673772

**వెల: రూ. 5/-**

6వ ప్రచురణ

# మీ జీవితంలో

# ఉందిలే మంచికాలం ముందు ముందునా ...

స్ఫూర్తితో జీవించాలి
తరగని ఉత్తేజాన్ని నిరంతరం పొందాలి.
పాటలు - ఈ సినీ పాటలు ఆపాత మధురాలు
స్ఫూర్తిదాయకాలు - అపూర్వ ప్రేరకాలు
వ్యక్తిత్వ వికాస కారకాలు

**మనసులో పాడుకోండి. మంత్రంలా మననం చేసుకోండి**

**సంకలనం : వేగేశ్న గోవిందరాజు**

స్ఫూర్తి:

**లక్షల ప్రతులు అందించాలనే**
**సత్సంకల్ప లక్ష్యంతో**
**సహృదయుల సహకారాన్ని ఆశిస్తున్నాం.**
**మీరూ ఆశీర్వదించండి.**

గోరంత దీపం
కొండంత వెలుగు

మంచి పుస్తకం నీడన
మీ మనసెంతో చల్లన

**పూలబాట ప్రచురణలు**
హైదరాబాద్ - 500 072

**రూ.5/-** **20** పేజీలు

**2010**